కం. అని తనలో తను కుందుచు
మెనయఁగ మనసిజుని వెతలు నిసుమడిగొనఁ- జ
య్యన బొరలు లేచు వెగ్గిలు
ననితరఘనతరవియోగహతమానసయై. ౨౨౧

సీ. ఊరకే తలయూచు నులికి దిగ్గనలేచు
        నిల్పుటద్దము జూచు నేలవ్రైచు
చిలుకకూతల కులుకు పిలువకనే బలుకు
        కనుల నశ్రువు లొలుకు గతికి నలుకు
మరువేదనలఁజెందు మది తహతహఁ బొందు
        కళవళంబందు బెగ్గిలుచు గుందు
విభవంబులకు రోయు వెడఁదకన్నులు మూయు
        దెసఁజెడి ధృతి బాయు నుసల డాయు

గీ. దైవమును దూఱు తగని వేదనల చారు
నెలఁతలను దువ్వు బొట్టవేల నేలఁద్రవ్వు
కాంతుని దలంచుఁ దమిఁబొంచు లోఁగిలించు
మదిని యెనలేని వేతఁబూని మంజువాణి ౨౨౨

ఉ. ఎవ్వరినే భజింతు నిక నెవ్వరి కీ వెత విన్నవింతు నేఁ
డివ్విధమెల్ల సాటిసతు లించుక విన్న ననాదరంబుగా
నవ్వుచు నర్మగర్భవచనంబులచే నను రెప్పనాడి తా
రవ్వల రవ్వలంబరపు టంతియెగాక హితం బొనర్తురే ! ౨౨౩

చం. చనువున నిన్నినాళ్ళు విడజాలని ప్రేమ మెలంగియున్న చ
క్కనివిభుఁ బ్రాయఁపుం దఱిని కాంక్ష మెలంగనినాడు చెల్వ ! శూ
న్యనిలయమందు దీపమిడినట్లనెగాదె తలంపు పీనితో
నెనసెడి సుందరాంగి మునుపెంత తపం బొనరించియుండెనో. ౨౨౪

ఉ. అద్దిర వానిచక్కఁదన మమ్మకచెల్ల తనూవిలాస మా
నిద్దఁపు జాళువా పసిఁడినిగ్గులుజిల్కు చొకాటమో బొమల్

దిద్దినరీతి నొప్పు జిగిదేరెడు కావిమెఱుంగు మోవియే
ముద్దులగుమ్మ లుం గనిన మోహపయోధి మునుంగకుందురే. ౨౭౫

సీ. వానిముద్దులమోవి నానఁగా మదినాస
గొనుచు గ్రుక్కిళ్ళూరి కొన్నినాళ్ళు
మెఱుఁగువాని యెడందయురము పొందికఁ జూచి
గుబ్బలాము నణంచుఁ గొన్నినాళ్లు
తళుకులొ వానిచెక్కుల ఁగాంచి యూరకే
కోరిక నోరూరఁ గొన్నినాళ్లు
దినదినంబును వాని తనురుచు ల్గని మది
గొదలేని వెతనొంది కొన్నినాళ్లు

గీ. నెదిరి చూడఁగ నేటికీ యద నొదవఁగ
దైవవిధిచే వియోగమే తారసిల్లె
నెటులఁ గనుగొందు యెవరి నింకేమ నంద
హితు లెవరు ముందు జీవనం బెట్లు గందు ౨౭౬

వ. అని యిత్తెఱంగునఁ జిత్తంబు చిత్తజాయత్తంబై వియోగజనితవిరహదహన దాహంబునకు మోహంబు సాహాయ్యంబై నిట్టట్టు నెట్టుబెట్టు సిట్టూర్పులం బిట్టదరి యెట్టకేలకుం బట్టులేక గొట్టుమిట్టాడుచు - నంతకంతకుం దురంతకంతులతాంతకుంతాహతస్వాంతరంగంబున నింతింతనరాని చింతాసాగరం బనివారితంబై పెల్లుం బెల్లగిల వెల్లిగొన నల్లగ్రుడ్డులం దల్లుకొని మేరస్మీరిన విచారంబుచే నళుకుబెళుకులం దుళకించి తమ్ములం దొమ్ములాఁడు కందమ్ముల కందమ్ములగు కజ్జలమ్ముల కజ్జలమ్ములుగా నెమ్మి లెక్కి మెఱుంగుం దొఱంగం జేసి లసదరుణతరతరుణ సరసీరుహపరిమాణమ్ములగు దృక్కోణమ్ములఁ జెన్నారు కన్నీరు పూర్ణంబులై తూర్ణంబున వెడలి కర్ణయుగాకీర్ణం బగుట-తమతాపపుటపాకస్వర్ణకర్ణాపతంసంబులం గదయు బదునున వగలం బొగల బొగడు పొగలెగయ సుందరకరారవిందంబునం గప్పు కొప్పుప్పళింపం గప్పుకపురంపుఁ బుప్పొడుల నొప్పు గొప్పవిరిసరులం దొరల, మబ్బునుబ్బునం గెబ్బు వేణీభరంబు పీడి

యవయపంబు లాచ్ఛాదింప- సంచరితనిఖిలగ్రహగణగణంబగు గగనం బవసి పయింబడు తెఱంగునం బాప-నిషిక్తాంగంబుల బౌకము పులక సస్యాంకురంబులకుం బ్రవహింపం గట్టిన జలప్రవాహంబునం బ్రతి క్షణజనితస్వేదకణగణగంగాతరంగంబులం దొఱంగనీకం గుదిలించు ఘటతరణిప్రతిభం దనజీ-పయంటం దొలంగి మెఱుంగు బహిర్గతంబౌ శాతకుంభకుంభోపమానవిజృంభితకుచకుంభంబు లుత్తంభంబులుగా శూలిఫాలాభీలకీలాజాలభూతీకృతచేతోజాతవియోగజనితాకులతం దల్లడిల్లి జాబిల్లిం బట్టి బిట్టుశోకించు రతీకాంత తెఱంగున నొక్క నెలకాలం దిద్దిన మెఱుంగుటరుంగునన్ మేను జేర్చి మనస్సంగజాగరకృశత్వాద్యఖిలదశలం గలంగుచుండునంత- ౨౬౩

మ. తనలో దా నభిమన్యురూపములనే ధ్యానించుచుం జూచి న
ట్లనె మెచ్చుం బొలయల్కఁ జెందు మది వేక్క న్నవ్వుచుం బల్కరిం
చును దర్కించును లజ్జ జెందును చలించున్ చిత్తము న్నిల్వరిం
చును మేలెంచును దిక్కులెల్లఁ బరికించున్ మిథ్యలం చెంచుచున్. ౨౬౪

కం. ఏతాదృశగతి చేతో
జాతశరవ్రాతపాతచకితాత్మకయై
శాతోదరి భీతిలఁగ వి
నీతాదరు లగుచుఁ జేరి నెచ్చెలు లెల్లన్. ౨౬౫

కం. బాలా యీలాగున రవ
మేలా! మేలాయె చిత్తమేలాగో నీ
మైలాగో! నీలోఁ గల
యాలోచన దెలియఁ బలుకవమ్మా! కొమ్మా! ౨౬౬

ఉ. ఎన్నఁడులేని వింత యిపు డేటికి నీవలపంత మున్న రా
కన్నియ లింతహంతకముగా మదిచింత యొకింతబూని . మేన్

మిన్నతికొంత గాసిలఁగ మిక్కిలి యింత గొఱంతఁ బూనుచే
యెన్నని సంతకాంతలిక యెంతవిసంతల నెంతురో సఖీ. ౨౮౧

చం. పెనిచినచిల్కలం దఱిమిపెట్టెద వేమి?యనుంగు చేఁడెలన్
వెనుకకు నెట్టెదేమి? నిను వేమరు లొందు మరాళశారికా
గణముల దిట్టె దేమి?కసుగందని నీనెఱసోయగంబు క్రొ
న్ననవిలుకాని కాఁకల నణంగి కరంగదొఱంగె దక్కటా! ౨౮౨

సీ. ఇంపుఁగా నమృతంపు నింపఁగా తానముల్
బెంపఁగా వీణ వాయింపవేమి ?
కన్దమ్ములకుఁజూడ నందమ్ముగా మంచి
గందమ్ము మేన నలందవేమి?
దిట్టంబుగా తలకట్టుచుట్టున కలి
గొట్టుపూవుల దండఁ జుట్టవేమి?
నిద్దంపుక్రొమ్మించు టద్దంబు చేఁబూని
ముద్దుమోమున బొట్టు దిద్దవేమి?

గీ. కలికి!కపురంపుఁ బలుకులు జిలుకుపలుకు
లొలుక చిలుకలపిలుకల కలరవముల
నింపుమీరంగఁ దెలియ బోధింపవేమి?
మహిని గలదటె నీవంటి మచ్చెకంటి ? ౨౮౩

కం. ఇంటంగల బలుపెన్నిధి
వంటి నరాత్మజుఁడు నీకు వరుఁడౌటయె క
న్గొంటి మిక వేరె కోరిక
పంటలకుం గొదువయేమి?బాలేందుముఖీ ! ౨౮౪

చం. మనమున నీవు వేర నొక మానవనాథకుమారుఁ గోరి యి
ప్పెనువలఁ గృశించి ధృతి భీతి వహించెదొ గాక పార్థనం!

దనుని వియోగమోహపరితాపము నొందెదొ? మున్న నిన్ను జూ
చినగతిగాదు నీవెడఁగుచిన్నియు లేఁత విచిత్ర మస్మ్వదిన్. ౨౮౫

కం. కన్నియల నెందఱనిం
గన్నారముగాని సిగ్గు గడకొత్తి మదిన్
మున్నరికెలంగొన్న సతిం
గన్నెల నెందైన జూడఁగా రే దబలా! ౨౮౬

ఉ. ప్రోడవుగావు జూడఁ బసిపూఁపవు నేటికి పల్లునెత్తి మా
టాడఁగలేవు యీగతి గయాళితనం బొనరింపకమ్మ నీ
వేడుకలెల్ల మేమె నెరవేర్చెద మమ్మ పసిండిబొమ్మ నీ
తోడిది నమ్మవమ్మ మముఁ ద్రోయకుమమ్మ కురంగలోచనా! ౨౮౭

ఉ. మత్సుతకుం బ్రియాప్తి సభిమన్యుఁడె భర్త యటంచు రాముఁడ
త్యుత్సుకతన్ వచింపుటది యొక్కటెగాదు సుభద్ర నీయెడన్
వత్సలతం గుమారున కవశ్యముఁ బెండ్లి యొనర్చు కోరికన్
హృత్సుఖలీల వర్తిలఁగ నింక విచారము లేల మానినీ! ౨౮౮

మ. అని ధైర్యోక్తులు నెచ్చెలుల్ బలుకఁగా నంభోజసౌగంధి నె
మ్మన మెంతే దిటమూని యాశఁగొని వేమారున్ బ్రియాధీనజీ
వనయై యొక్కనిమేష మబ్దముక్రియం భావించుచున్ మీనకే
తనబాణానుభవప్రభీతి మది సంతాపించుచున్నంతలో. ౨౮౯

కం. ఇవ్విధమున శశిరేఖయు
నవ్విడుపున నృపుఁడు మానసానుభవముల
న్నెవ్వగల బొగిలి రనఁగా
నవ్వలికథఁ దెలుపు మనుచు నధిపుం డడుగన్. ౨౯౦

## ఆశ్వాసాంతము

ఉ. పారదశారదాభ్రపరపంకజకుందపటీరమల్లికా
నారదచంద్రఖండహిమనాగకులాధిపరౌహిణేయమం
దారమరాళచందన విధాతృసతీశరతాహారడిం
డీరసురాధ్యజిష్ణుకరటిప్రతిభాచ్ఛయశఃప్రదీపితా ! ౨౯౧

పంచచామరము —

పురందరప్రభృత్యమర్త్య
పూజితస్వపత్కజా!
మరందతుల్యవాగ్విలాస
మంజులాస్యనీరజా!
అరిందమప్రతాపనిస్తు
లాయతస్ఫురద్భుజా!
ధురంధరప్రభాపతంగ
తుంగమంగళధ్వజా! ౨౯౨

*నాగబంధము.*

చం. ఖరకరకోటిభాసవరకారణ
భవ్యదయారసౌఘదు
ష్కరమదవైరిదూరకర
సారసవిస్ఫుటితాగశోభనా !
సురవరమేనసారధర
శూరకవిస్ఫురితారభావితా
స్థిరఖగమోదకార,భవ
సేవనఘట్టనవాదకోవిదా! ౨౯౩

## నాగబంధము



చ. ఖరకరకోటిభారవరకారణభవ్యదయారసౌఘమ
ష్కరమదవైరిదూరకరసారసవిస్ఫుటితాగశోభనా!
సురవరమేనసారధరశూరక విస్ఫురితారభావితా
స్థిరఖగమోదకారభవసేవనఘట్టనవాదకోవిదా! (౨-౨౯౩)

10)

మ. ఇది శేషాచలనాయకాంఘ్రియుగళీ
హృష్టాత్మశ్రీవాసవ
ర్యాదళ ద్వేంకటరామవాగ్గణియపి
యస్వచ్ఛమౌద్గల్యవం
శ్యదమో భావనవర్యపుత్రనరసిం
హాచార్యవాగ్భూషణా
స్పదతాలాంకసునందినీపరిణయా
శ్వాసద్వితీయం బిలన్. ౨౯౪

ఇది—

శ్రీమచ్ఛేషధరాధర సౌధపీఠీవిహరణ వేంకటరమణ
చతుర్విలక్షణాక్షీణకృపాకటాక్షవీక్షణాపరిలబ్ధ
లక్ష్యలక్షణానవద్యవిద్యావిలాస శ్రీనివాసగురు
చరణస్మరణాభ్యసనరసనావికాస నిస్తుల్య
కల్యాణసాకల్య మౌద్గల్యగోత్ర
పవిత్రభావనాచార్యపుత్ర
పర్వత్రయకైంకర్యవిధాన
వేంకటనరసింహార్యాభిధాన
ప్రణీతంబైన
తాలాంకనందినీ పరిణయం
బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము



# తాలాంకనందినీపరిణయము

## తృతీయాశ్వాసము

కం. శ్రీరమణీకుచయుగఘుస
సారమ్మృగీమదసుగంధచర్చితవక్షా!
చారుసుమశరసదృక్షా
సారససదృశాక్ష శేషశైలాధ్యక్షా! ౧

కం. అవధారయ! జనమేజయ
సవధామనిధిప్రతాపునకు పైలుం డ
వ్యవధానముగ సుధాధా
రవిధాయకసూక్తు లాదరంబున బలికెన్. ౨

కం. అంతట శశిరేఖగృహా
భ్యంతరమున కుసుమతల్పమందు నొఱిగి య
క్కంతుశరకుంతసంతతి
కెంతో మది చింతనొందు నింతటిలోనన్. ౩

చం. నునుజిగురున్ ఫిరంగి సుమనోరజమన్ వడియందు నింపి గ్ర
క్కున విరిగుత్తిగుం డొకటిగూర్చి పరాక్రమ మగ్గిఁ జేసి యం
గనకుచదుర్గసీమ గుఱిగా వలరాజుసిపాయివైచె ఫె
ళ్లున శుకశారికాదిభటులున్ పడి లగ్గలకెక్కి యార్వఁగన్. ౪

కం. ఆయేటున కోర్వక సహ
హా!యని తమిసోలి దు . . . యాసమునన్
జేయు నుపాయములేక ని
. . .యతనము వెడలి చెలుల కగపడకుండన్. ౫

చం. పనిగలరీతి మంచ మొకపట్టియ చేతుల నూత జేసి చి
వ్వున వడిలేచి మేల్ముసుఁగు బొందికవైచి కటిం జెలింపు వీ
డిన నెదకొప్పు వీఁపున నటింపఁగ లేఁజెమటల్ దొఱంగ త
న్వెనుకొను కీరశారికల వేసరిదిట్టుచు నూర్పు లొట్టుచున్. ౬

కం. వెఱపు విడి తానొకర్తుక
యురుతరవేదనల నంతికోద్యానమునం
జరియింత మను దలంపున
దరలెం దరళాక్షి మన్మథప్రేరితయై. ౭

కం. ఆరామపుత్రి యనదఁగు
నారామామణి గృహాంగణారామమునం
ధారాధరమ్ములోపల
నైరమ్మదలతిక జొచ్చినట్టులఁ జొచ్చెన్. ౮

సీ. పిడుఁగులవలె వనప్రియరావ మదలింప
పులులట్ల కేకు లద్భుతము నింప
సుమపరాగము కంటకములై యతుఁగు లంట
సుమములు మన్మథాస్త్రముఁల గెంట
గండుతేంట్లు తుపాకిగుండులై యెదఁ దాక
నలసమీరము సోఁకుఁడగుచుఁ బ్రాక
పల్లవంబులు వాడి జల్లీటలై గ్రుచ్చ
వలిగప్పురము ధూలివలెనె హెచ్చ

గీ. తిరిగి తిరిగినచోట్లనే యరిఁగి యరిఁగి
తపసి బెదసిన గతి యుడ్డుకుడిసి జడిసి
గొదల బొదలుచు మల్లెపూఁబొదల మొదల
దీనగతి కోర్చి యొక్కచో మేను జేర్చి. ౯

చం. ఉలుకుచు నుస్సురంచుఁ దలయూచుఁ దగన్ వలవంతఁజెందు బె
గ్గిలు మదిలోన బొక్కు టులికించు నగుం బ్రలపించు స్రుక్కు ని

శ్చలత వహించు చెమ్మటలు జార(గ నూర్పు చలించు గద్గగా
కులత వహించు పల్కు వెత( గుంద( గసుంగప నించు బాష్పముల్. ౧౦

కం. ఇటు లనివారిత విరహో
త్కటజనితశ్రమను మదిని కటకట(బడి య
క్కుటిలాలక దిటమోపక
సొటసొట కన్నీరు వదపుచుం దనలోనన్. ౧౧

సీ. మొగిలిరేకుకటారి మొనసాట రొమ్మున
గ్రుమ్మి ప్రాణమ్ము బోజిమ్ముదాన
తుంగమై బొంగు గొజ్జంగి కాలువలోన
నుంకి గుభీలున దుంకుదాన
బూవుదండకు గుజ్జుమావికి నురిగూర్చి
కొంచక మెద బిగియించుదాన
తే(టతేనియలోన గాటమౌ కపురంబు
మెదపి సాహసముచే మ్రింగుదాన

గీ. గాక యీకోకిలబలాకలోక కేకి
కోకమదచంచరీకశారీకదంబ
మేకమై పైకొనుచును జికాకు(జేసి
దాక యీకాక కెటు ముందు దాళుకుందు. ౧౨

కం. బెడిదమగు తుంటవిల్తుని
యడిదంబుల కోర్వలేక నారటచే ని
క్కడ కే(గుదెంచు టమ్మలు
వెడలిచి కొట్టొత్తినట్టి పథమై దోచెన్. ౧౩

కం. ఈలీల వియోగానల
కీలాజాలానువేలకీలితయౌ త
ద్బాలామణి( బొడ( గానక
నాలో నెచ్చెలులు భయసమాకలితమతిన్. ౧౪

ఉ. అచ్చటి రత్నపంజరములందలి చిల్కలు కాంతవార్త వా
క్రుచ్చి వచింపఁగా మదిని కేవల మాత్రిని వారిలోన వా
రచ్చెరువందుచుం గట కటా పసిబాలగృహంబుబాసి నేఁ
డెచ్చటికేఁగె మనకి కేమి యుపాయ మటంచు నెంచుచున్. ౧౫

కం. అయ్యనుఁగుం జెలు లందఱ
లయ్యయ్యో మోసపోతి మని బెగ్గిలి దా
మెయ్యెడల నిలువనోపక
తొయ్యలి నందంద వెదకఁ దొణఁగిరి వనిలోన్. ౧౬

మ. చెలి యీకప్రఁపుఁ దిన్నెలెక్కి పవళించెం జూడుఁడీ గుజ్జుమా
వుం నీడం జరియించె గాంచుఁ డిదిగో పున్నాగకుంజాంతరం
బుల గూర్చున్న దెఱుంగుఁడీ యిట విధుప్రోద్యచ్ఛిలావేదిక
న్నిలిచెం గన్గొనరమ్మ జాడ లిటు నిర్ఝరప్రాప్తి జూడం దగున్, ౧౭

సీ. సౌపానముల నెక్కఁజాలనిబాల యీ
కృతకాద్రులెట్టు లెక్కియుఁ జరించె
సుమలత ల్పొరయ నుస్సున నూర్చు బోఁటి యీ
మరుఁగుపూఁబొదరిండ్లు జొరఁగనోపె
వల్లకీధ్వని దల్లడిల్లు ముద్దియ యెట్లు
కోకిలల్ పెల్లార్చు ఢాకకోర్చె
సురఁటీల విసర వేసరటజెందెడి ముగ్ధ
యీగాలిధూళుల కెట్టు లోపె

గీ. ముంపునిద్దంపుసొంపు తాకెంపుటింఢ్లు
జొచ్చి కనువిచ్చి మెచ్చనిమచ్చకంటి
బెట్టుకలిగొట్టుచెట్టుల చుట్టుముట్టు
లెట్టు దిరిగెనొ బొట్టిరాపట్టి యిపుడు. ౧౮

సీ. మూఁకలై పధికహృద్భీకరంబులు గాఁగ
కోకిలానీకముల్ గేక లేయ

తుమ్మెద ల్బలు దుమారమ్ము లేపుచు బయల్
గ్రమ్మి ఝుమ్మని తలది మ్మొనర్పఁ
బిల్లతెమ్మెరలు మేనెల్ల చిల్లులు వోవ
చల్లనై బెల్లుగా నల్లుకొనఁగఁ
గప్పురంబుల బూదిపుప్పొడు ల్గొప్పలై
తెప్పలా గుప్పున నప్పళింప

తే.గీ. నింటను చిరంటు లెవరు లేకుంటవలన
జంటవిడి యొంటరిగ కోనవెంట దిరిగి
తుంటవిల్కాంటతూఁపుల నంటి యెంతఁ
గంటకించెనొ గదరె వాల్గంటులార ! ౧౯

సీ. లలితమ్మ్రణాళనాళమ్ము లచ్చట జూచి
చెడుగుఁ జిల్వ లటంచు జడిసె నేమొ !
కోకిలంబులకూక లాపులంబు లొనర్పఁ
పెనుభూతము లటంచు బెదరెనేమొ ?
కారుపూఁబోదల మయూరంబులను జూచి
సోఁకుమూఁక లటంచు సొలసెనేమొ !
గుంపుమావిజిగుళ్ళజొంపంబు గనుఁగొని
వనహుతాశనియంచు వణఁకెనేమొ !

గీ. లీలచేనైన క్రౌన్ఛనవాలుఁజోలి
మూల మెఱుఁగని యిప్పసిబాలకీవి
రాశిఁ దూలఁగఁజేసె యీవేళ గోల
నెందువెదకుదమని భయం బంది గుండి. ౨౦

సీ. సుకపొన్నప్రమాఁకుల జోడుల నీడలఁ
జెలువొందు కలిగొట్లు చెట్లపట్ల
పాటలద్రుమముల తోఁటలమాటుల
లలితవాసంతికాలతల జతల

సురభితసురసాలతరువుల మరువులఁ
క్రీడావినిర్మితగిరుల దరుల
సారసప్రథితమౌ సరసుల సరసులఁ
బుష్పాసవములొప్పు పొదలఁ మొదల

గీ. నారయుచు వేర నొకమేర సౌరభప్ర
పూర లతికాకుటీర విస్ఫారచారు
సార సుమనోరజాప్త శృంగారవేదిఁ
జేరి పొగలెడి సిరికుమారి నెదుట. ౨౧

మ. ముసుకుం బాయఁగ ద్రోచి నల్గడల నెమ్మోమెత్తి వీక్షించి లో
నుసురంచు న్మరుసంప చిచ్చులకు నిట్టూర్పు ల్విడంబింప దృ
గ్జలజాతంబుల బాష్పము ల్దొరగ కంపీభూతసర్వాంగయై
యసిధారాపథరీతి దల్లడిలు నయ్యబ్జాక్షినిం దవ్వులన్. ౨౨

కం. కాంచి యుదంచితధైర్యస
మంచితమతి యంచలంచ లట బొంచి నిదా
నించి సమీపించి సతీ
సంచయము లొకించుకన్ విషణ్ణహృదయలై. ౨౩

సీ. ముత్యపుఁ జిప్పలఁ బోలుచు కెంపులరీతి
కనుఁగవ లరుణత గాంచు టేమి ?
హోమకుంభముల మోసెత్తు నీలము లట్లు
పాలిండ్లపులక లేర్పడుట లేమి ?
శంఖరాజము వజ్రశకలము ల్గనులీల
గళమున ఘర్మాంబుకణము లేమి?
కప్పుమబ్బున మరకతము లుట్టినభంగి
జడవీడి వెంద్రుకల్ జెదురుటేమి?

గీ. యనుచు విస్మయమున నహహా!యటంచుఁ
దర్జనీన్యస్త నాసికాతలము లమర

నతివిషాదభరావృతస్వాంత లగుచు
చుట్టుచుట్టుక వెఱఁగంది చూచి చూచి. ౨౪

సీ. వెదవిల్తుని శిరంగి వెదలు సిరసజారు
కన్నీరు పన్నీటఁ గలయఁ దుడిచి
తమిమిక్కుటంబైన తలకెక్కి సుడిఁ గొను
గడనున్న పెన్నెఱుల్ గలయ దువ్వి
చనుజక్కవలుబెట్టు పెనుగ్రుడ్డులో యన
జిక్కుజెందిన సరుల్చిక్కుఁజేసి
యహరహం బరుదాగలహరి బయల్వొంగు
పగిదిజారిన కావిపైట దిద్ది

గీ. జివురులప్పట్టి మావిని జెంగలించు
సరణి జెదిరిన మణిసరుల్సవరపఱచి
కౌఁగిట గదించి బొదవుచు గారవించి
చనువు నొనరించి తనుతాపమును హరించి. ౨౫

తే. గీ. ఫలము లలరులు కింజల్కములును గొన్ని
మించుఁబోడికి మైసురాళించి వైచి
బొమలసందున గపురంపు బూదివెట్టి
కంఠసీమను కురువేరుగట్టి యనిరి. ౨౬

చం. కులుకుమిటారి గబ్బిపలిగుబ్బలు గ్రాగి మెలంగనేల క్రొం
దళుకుపసిండి వన్నెల సడల్చెటి మేను గలంగనేల క
న్నుల నునుగెంపు చెంపల బెనుంగఁగనేల మెఱుంగుకప్పు వే
నల జెదరంగనేల లలనా నగుబాటిదిగాదె బోఁటికిన్. ౨౭

కం. తెలుపఁగరాదో మా కది
తెలియంగా రాదా! తెలిసితే పనిగాదో?

తెలియుటకు మాకు వలదో!
తలఁపునకున్ రాదొ! తెలుపతగ వదిగాదో? ౨౮

ఉ. ఇమ్మెయి ముమ్మరంపు వెత నేటికి గుందెదవమ్మ యివ్వనాం
తమ్మున హంతకమ్మన పదమ్ములు నొవ్వఁ జరించెదమ్మ చొ
క్కమ్మగు నెమ్మొగమ్ము కసుగందెగదమ్మ రయమ్ము లెమ్ము మా
యమ్మ మనమ్ము నుమ్మలికనందక సమ్మతిలమ్మ కొమ్మరో? ౨౯

సీ. చండాలు లౌచు కుజనసంగతి మధు
పానదుర్మత్తు లీభ్రమరకములు
పాంథభీతి ప్రదార్భటు లొనర్చుచు హరి
ప్రద్వేషులైన యీబర్హిణములు
కాలాకృతిని పలుగాకులలోఁ బుట్టి
పంచమరీతులీ పరభృతములు
ఘనవిమతత్వంబు గని విషావాసులౌ
జాలపదంబు లీ సరసిజములు

తే. గీ. పుణ్యతరులను ఫలభంగముల నొనర్చు
పక్షపాతంబులీ శుకప్రకరములకు
భావమున భీతిలేక నీవేవిధమున
ధీరమతి నుంటివమ్మ బంగారుబొమ్మ! ౩౦

చం. మదనసమానమూర్తి యభిమన్యుఁ డనన్యమనీషి యెల్లి నేఁ
డిదె నిను కూర్మి బూని వరియించగలండు నిజమ్ము నమ్ము మో
మదకలహంసయాన వినుమా' యనుమానము మాని పూలుగో
యుద మికలెమ్ము రమ్ము వని నుత్సవలీల జరింపఁగా దగున్. ౩౧

కం. అని యనుఁగుంజెలు లావని
తను తనుతాపంబు దీర్పదగు మాటల నె
మ్మన మనుమతింప నన జ
వ్వని వనితలతోడఁ గూడి వనిలోఁ జొచ్చెన్. ౩౨

సీ. తేటకాటుకదీటు మేటికొప్పుల సిటు
తేటికూటువుల జంఝూట మణఁప
తళుక్కుక్రమము లొల్కఁ కల్కిపల్కుఁ కుల్కఁ
చిల్కపిల్కఁకు మేసుల్కఁజూపు
సిరిప్రాఁపులను జూపు నెఱజూపు సుమవాపు
తూఁపురూపుల నేపు మాపుజేయు
నివ్వటిల్మవ్వంపు నవ్వులై యవ్వల
దవ్వుల పువ్వుల రవ్వఁజేయ

గీ. లతలకన్నను తనుమృదులతలు గొన్న
వనిత లందరు జొచ్చి యవ్వనితలమున
నిరతిశయమానసానందనిరతిఁ జెంద
జూడ నొకవింత విహరింపుచుండి రంత. ౩౩

సీ. దిగుపరాలినపండ్లు చేరిఁదావక నుండె
పతితవస్తుస్పర్శ పాప మనుచు
సుమనికుంజంబులఁ జొచ్చి మెచ్చక నుండె
చండాలులకు నివాసంబు లనుచు
చేముట్టి కుసుమముల్ జిదుమఁగోరక నుండె
రహి రజస్వల నంచరా దటంచు
తలిరుటాకుల పందిరులను నిల్వక నుండె
గురుమధుప్రియసక్తి గూడదనుచు

గీ. తలఁచియో లేక నాథుని వలచియో, మె
ఱుంగుబోఁడి వనక్రీడకుం గడంగ
కున్న భావం బెఱింగి యక్కన్నె లెల్ల
వనవిహారంబునకు జాళిమొనయఁ జేసి. ౩౪

ఉ. తేఁటులఁ జారద్రోలి విరితేనెరుచుల్గని గ్రోలి పూఁబొదల్
మాటికిదూరి సౌరభసమగ్రసుమమ్ముల నేరి పుష్పొడుల్

వేటులనాడి యుండొరులు వేడుకగూడి మరాళకోటిస
య్యాటలఁ గొల్పి యవ్వనవిహారము సల్పి రనల్పలీలలన్. ౩౫

చం. చెలువగుడాక పందిరులచెంగటి క్రొన్నెలరాల దిన్నెప
జ్జల నెరిగుజ్జుమావిగమి చక్కనిగొజ్జఁగితేఁటనీట వా
కలదరి కుందకుంజలతికానికరంబుల నీడగుంపు గుం
పులుగొని వేడుకల్మిగుడ ప్రోడలు క్రీడయొనర్చి రవ్వనిన్. ౩౬

సీ. ఎలుఁగెత్తి యొండురు ల్గలయ దా బిల్చుచో
కలకంఠకలకంఠముల నదల్చి
మందప్రచారలై యదంద మెలఁగుచో
కాదంబకాదంబగర్వ మణఁచి
పచరింపుచో కుచపాళి పైట దొలంగ
చక్రచక్రస్ఫురచ్ఛాయ నొంచి
వాతెఱ ల్గదలవాక్చాతురుల్ జిల్కుచో
ప్రతిబింబప్రతిబింబ పటిమ నెరపి

తే.గీ. ఒక రొకరిగేరుచో పకాపకను నగవు
లలర దాశిమములబోలు నలరదాశి
కాంతలు జెలంగ మెలఁగి రక్కాంత లధిక
యౌవనోత్సాహమునజేసి యవ్వనమున. ౩౭

సీ. మరుమావుపిండ్లు గ్రుమ్మరు మావిపం డ్లనే
కములు గారాపట్టి కాన్కబట్టి
గములు గానలరు పూఁగములగోసి పడంతి
భావం బెరింగి 'యుల్పా' లొసంగి
కేసరంబులనొప్పు కేసరంబులు కొన్ని
నాతికోరిక మెచ్చి 'నజరు' లిచ్చి
కోకిపల్లవమంటి గొనవిపల్లవ మంట
ఘంబు లెల్లనుజూపి భ్రమత రేఫ

గీ. యిదిగొ గొజ్జంగిపన్నీటి యేటితేట
నీట నానాట నాటుపూఁదోట మాటు
చోటులనుచును జూప నచ్చోటు వెడలి
వని జరించెను ప్రోడజవ్వనులతోడ. ౩౮

కం. చలితాంఘ్రిద్వయనూపుర
కలనాదార్భటులు విమలకాసారచర
త్కలరాజహంసవితతుల
చెలిమిం గొనజేర బిలుచుచెలువు దలిర్చెన్. ౩౯

సీ. ఈచంపకద్రుమం బెక్కి పూల్గోయవే
ఖంజనేక్షణ నీకు గలదు ప్రీతి
యీదాడిమఫలంబు లెక్కి చేనందవే
శుకవాణి నీకు నించుక యపేక్ష
యీగుజ్జులేమావి యిగురులే గోయవే
కోకిలమృదువాణి నీకు కోర్కె
యీపూవుఁబొడిదిన్నెపై పవ్వళింపవే
యలివేణి నీకు మహాదరంబు,

గీ. కొమ్మ మీకోర్కెగని తెల్ప కోపమేమి
పైకెగయనేమి?ముఖ మెఱ్ఱబార నేమి?
యిటుల కన్నుల కెంపుదయింప నేమి?
మఱి మొరయనేమి? హోరె మీ మనసుకొలఁది. ౪౦

కం. వనితామణు లేగతి యి
వ్వనితావుల నెరయు కోర్కె వాటిల్లని కుం
జనితాంతవిమలసౌరభ
జనితానందమున బ్రొద్దు జరుపుచు క్రీడన్. ౪౧

సీ. శుకవాణిమావికొమ్మకు తారసిలె బిం
బోష్ఠి నీవచ్చోట నుండకమ్మ

గజయాన విర్రమాఁకు గవిసెను శతపత్ర
నేత్రి నీపచ్చోట నిల్వకమ్మ
ఘనవేణి క్రీడానగము జేరెను మరాళ
యాన నీవచ్చోటి కరుగకమ్మ
భుజగరోమాళి యిప్పుడె తాగల్ గొనసేఁగె
చంద్రాస్య నీవిందు జనకుమమ్మ

గీ. యనెడు సతితోడ వేరొకవనిత జూచి
మోస మికనేమి? సాంక వామోదలసమ
సింహమధ్యలు పావనచిత్రచరిత
లజ్జవదనలు వీరికేమనుచు బలికె. ౪౨

సీ. కొందఱు కొఁదీఁగె లందంద జలియింప
లతికావితానముల్ లాగి లాగి
కొంద ఱున్నతకు చగుచ్ఛంబులు వడంక
మంచిపూఁగుత్తులే ద్రుంచి ద్రుంచి
కొంద ఱడుంగు జిగుళ్లు తొట్రుపడంగ
కిసలయంబుల నెల్ల గిల్లి గిల్లి
కొందఱు భుజమూలగురుహేమరజ మొల్క
పుష్పొడు ల్పయలంట గుప్పి గుప్పి

గీ. పాణికిసలాధరోష్ఠబింబభుజనాళ
ముఖసరోజంబులకు తూఁగి మూఁగు పైక
శుకమరాళాళులకు భీతి జొక్క జొక్క
సతులు పుష్పోపచయకేళి సల్పి రపుడు. ౪౩

చం. ముగుద యొకర్తు సూనశరముల్ చెఱుకువ్విలుఁ బూని బొడ్డునం
దిగురుకటారిదాలిచి యహీనశుకాళిమరాళ కోటిలో
నెగురుచు నేమనోభవుఁడనే యని కాపుసులెల్ల భీతిజెం
దగ బెదిరించె యౌవనమదప్రమదంబున ద్రుళ్లియాడుచున్. ౪౪

చం. కురులు జడల్ బడం గలసి గూర్చి పువ్వొడిమాలి మేన స
చ్చెరువుగ దాల్చి దానిఱితచిక్కనిమల్లెసరాలుబూని క
ప్పురము లలాటపట్టికను బూసి పటీరము నెత్తి నించి నే
హరుండ నటించు దానిభయ ముడుగ జేసె నొకర్తు గ్రమ్మరన్. ౪౫

సీ. చరణాహతి నశోకతరువు నొక్కపడంతి
పొదిగింట కురవకంబును నొకర్తు
నూరువుచే సింధువారమ్ము నొకలేమ
కనుచూపులను తిలకంబు నొకతె
చేజాచి సహకారభూజంబు నొకయింతి
యమియుచు వకుళంబు నొక్కబోటి
గానంబొనర్చి ప్రేంకణము నొక్కవధూటి
పకపకనగి పొన్న నొకలతాంగి

గీ. ముఖవిదీప్తిని చంపకమ్ము నొకభామ
కలికి పలుకులగోంగు నొక్కపికవాణి
యలరు లెత్తించి రాయావిహారగతుల
బయలుపడనీక దోహదక్రియలు నెఱపి. ౪౬

కం. మఱి యవ్వన మెల్లను గ్రి
మ్మరి యౌవనగరిమ జెలంగ మహిళామణు ల
వ్వరిబొదల బొదలు మహిమలు
విరిబోణికి వేరువేర వినబల్కి రొగిన్. ౪౭

సీ. మల్లికావల్లికాతల్లజమంజరీ
మధుమదానందితమధుకరములు
సహకారఫలపూరసారసుధాహార
చంచద్వనీశుకసంచయములు
కాండజాతాహీనషండజాతగ్రాస
లోలమత్తమరాళబాలకములు

నవరసాంచితసుపల్లవరసాస్వాదనా
కాకలీకృతమదకోకిలములు

గీ. కృతగిరిస్రవనిర్ఘరోద్ధుతనినాద
ఘనదగర్జభ్రమానటద్వనమయూర
వితతులను జూడు మంగళవిమలగాత్రి
పంకజాయతనేత్రి తాలాంకపుత్రి. ౪౮

కం. మంగళము లలరు నీవా
లుంగనులకు శంబరంబులోఁబడి భీతిం
జెంగునను బఱచె చూడుమి
రంగద్గంగాతరంగ రమ్యత్రివళీ. ౪౯

తే. గీ. భవదధరసీమ బింబవిభ్రాంతి దోఁచి
శుకనికాయంబులెల్ల గాఁచుకొని తిరుగు
చున్నవిక జూడుమమ్మ నీ కన్నులెత్తి
కుందకుట్మలరదన రాకేందువదన. ౫౦

ఉ. కాయజుఁ డవ్వియోగులకు గల్గు రుజన్ హరియింప దాగులన్
ప్రేయనిజప్రతాపశిఖి వ్రేల్చు సలాకులలీల రక్తిమ
చ్ఛాయలపల్లవంబు లతిసాంద్రములై తరులం జనించె చూఁ
డీయెడ పద్మపత్రరుచిరేక్షణ సుందరతావిలక్షణా. ౫౧

చం. హరుఁ డలనాఁడు ద్రుంచు కుసుమాస్త్రుఁడు క్రమ్మఱఁగా జనించు సం
బరమున మన్మథుండు మును బ్రార్థన ద్రొక్కిన గండదీప మి
త్తఱి తలనెత్తెనో యనువిధంబున బుష్పితచంపకద్రుమం
బరుదుగ శోభిలెం గనుమి హల్లక బంధుజయాననాంబుజా! ౫౨

కం. ఈరీతి న్వనమహిమలు
నారీతిలకంబునకు మనం బలర సుధా

సారాతిరీతిఁ బల్కుచు
కోరకకుసుమాళి క్రమముఁ గోరికఁ బూరన్. ౨౩

సీ. సుందరీమణి యోర్తు కుందపుష్పంబుఁ గ్రుంచె
కలికి యొక్కతె చంపకముల దులిచె
నెలఁత యొక్కతె ఫుల్లనీరజముల్ నేర్చె
చెలి యోర్తు ఖాండీరములను గోసియె
పొలఁతి యొక్కతె పొన్నపూవులనే గోసె
మొగిలిపూవుల నొక్కమగువ జిదిమె
తరుణీమణి యొకర్తు దాసనంబుల రాల్చె
లలన యొక్కతె పాటలముఁ ద్రెంచె

గీ. వనిత లటు మానసోత్సాహమున స్వకీయ
రదన నాసాంఘ్రికుచజనాభివదన నేత్ర
కాధరాంగసుగంధమహావిభూతి
సాటిరావని నిరసించు సరణి నోప. ౨౪

సీ. రసదాడిమము జేరరాకు సొంకవగంధి
కీరధ్వనుల నాలకింపవలయు
గుజ్జుమావికి జేరకుమి చంచలాలోక
విమలపికార్భటు ల్వినఁగవలయు
సుమనికుంజంబుల జొరకు చంపకగంధి
చంచరీకముల నీక్షించవలయు
కమలాకరముల వంకకురాకు ఘనవేణి
సొగసైన యంచల జూడవలయు

గీ. నంతియేగాక వాని కాహారమైన
ఫలము లలరులు విరులు తూడులును బాప

పాపమేగాని దాన లాభంబు గలదె
పోదమిక రారె మనము సమ్మోదనమునను. ౨౪

వృషభగతిరగడ

వనితరో యీ వనితలంబున
ననతిదూరము జనితివే మది
ఘనతరప్రేంఖణ తరుద్యుతి
యనితరప్రియ వినుతియైనది.

కన్నె యింతటికన్న మిన్నతి
కన్నె గేఁదగి యున్నచోటికి
క్రొన్ననలు గై కొన్నసతి దా
కొన్నదని బై కొన్నతేటికి.

తమ్మలను మొత్తమ్ముగా త్రుటి
తమ్మజేయ హితమ్మ గాదని
తమ్మ పికజాతమ్మ లనవర
తమ్మ గలిసిన నమ్మరాదని.

కోరికలు చేకూర కాంచన
కోరకమ్ముల నేరికోయకు
సారసముల విసారముల ని
స్సారమని వేసారి ద్రోయకు.

మారుఁ డిట పలుమారు మెలఁగు సు
మారుగని యామారుకేఁ గుమి
వేరుగని నవ్వేరు నీనెల
వేరుకాని కురువేరు లాగుమి.

రంగుదనర కురంగనయనల
రంగమే బహిరంగ మయ్యెను

[illegible] వంగి [illegible] లత [illegible]
[illegible] [illegible] [illegible] కీయము.

మించు[illegible] బోదురు మించి [illegible]
మించి వసిసి భ్రమించె [illegible]
మంచితావులు మించు కొమ్మల
వంచి క్రొవ్విరి [illegible] లీలను.

ఇందుముఖి సీ [illegible]పెరుల వ
యిం దురాశ మె[illegible]ం వలంపకు
కుందరద మనసుం దగిన మా
కందరసముల క్రింద నొంపకు.

నేడు పున గన్నె[illegible]
చెరుకొన యానేరు మాటికి
[illegible] లెటుకో [illegible] [illegible]
మేరమీరు సమీరధాటికి.

కందములు మాకందములు కుర
వింద ములు కనువిందొనర్చెను
తుందముల సుమరందములు సుమి
ళిందములు ప్రియమంది చేర్చెను.

కాంత యీలతికాంతమున రతి
కాంతు డతిపల నింతి నొంచెను
సంతతంబు వసంతు డీ వా
సంతిలతికా సంతసించెను.

కమ్మవిల్తుని గమ్మకొన్న ఘ
కమ్మ లీలింకమ్మ మానవు
నిమ్మళముగా నిమ్మ యీ గజ
నిమ్మకొమ్మ ఫలమ్ము గానవు.

యేటికో యీ బోటుగునకై
మాటికిటు లారాట మొందెదు
బోఁటిరో యీపాటలం బొక
ప్రేఁటు కేటికొ సూటిఁ జెందదు.

తాముదము జతనాముకొను తా
మరలు గోతాముగా యని
రామ యీ యారామము న్విడి
రామి కింత విరామ మాయెను.

మావుల న్మరుమావు లొక్కట
ప్రోవులై వాపోవు మానక
తావులుంగల తావులకు -బో
తావు మునుపటితావు గానక.

కోరినట్లు చకోరనయనల
కోరకమ్ముల నేరుకొమ్మను
వారిజాక్షిరొ ! వారి దరిగని
వారి త్వరఁగను వారిరమ్మను. ౨౯

మ. వనకేళీవిభవంబునం దనిసి యవ్వామాక్షు లెల్లం దనూ
జనితస్వేదకణప్రశాంతికరచంచత్సారసానూననూ
తననిష్యందమరందబిందుచయ ప్రోద్యద్వ్యాలవాతూలశో
భనసౌరభ్యసరోవిహారవికసద్భావంబునం గుంపులై. ౩౦

సీ. విరహిణీజనచిత్తవికలీకరణశంబ
రారాతిబాణతూణీర మనఁగ
వనరమామణిమాధవప్రియార్పితమణి
ప్రకటనీరాజనపాత్ర యనఁగ
చక్రాంగయుగపంచశరకేళికాక్రియ
కల్పితమృదుసుమతల్ప మనఁగ

నవసీసతీరాజహంసార్థవిరచిత
తతరత్నకంబళాస్తరణ మనఁగ

గీ. సరిదధీశ్వరు దభ్రనిర్ధారిణి కొసఁగు
సకలమణిగణభరిత పేటిక యనంగ
బరగు పథికశ్రమవిమోచి బహుళవీచి
సరసిరుహరోచియగు సరోవరము జూచి. ౨౮

సీ. సలిలపూరితకమండలుసమప్రతిభగా
లలితమరందోత్పలము జెలంగ
హస్తలంబితనలినాక్షమాలిక భంగి
వనజాగ్రగతమధువ్రతము లంర
కటితటకాషాయపటము కైవడి గళ
త్తటతరుజీర్ణచ్ఛదంబు లలర
ఘనజటాపటలంబుగతి ప్రసూనపరాగ
జాలసచ్ఛన్నశైవాల మమర

గీ. తరుణినాభిగభీరతఁ దా ధరింపఁ
గొరి- తాపసవేష మిక్కొలను బూని
వని తపం బాచరించెనో యన జెలంగె
ననుచు చెలు లెల్ల విస్మయం బావహిల్ల. ౨౯

సీ. వరపద్మశంఖమకరకచ్ఛపాన్వితం
బై ధనేశ్వరుగేహ మనుకరించె
పటుశంఖచక్రవిభ్రాజితంబై రమా
పతికరద్వయిరీతి పరిఢవిల్లె
అనిమిషామృతపరివ్యాప్తమై పాకారి
మందిరప్రతిభ నానంద మందె
సంచితఘనరాజహంససంకాశమై
తారకాపథదీప్తిచే రహిఁజె

గీ. కుముదవరపుండరీకాదివిమల మగుచు
లాలితం బయ్యె దిఙ్మండలంబు కరణి
ననుచుఁ దత్సరసీతటంబునను జేరి
వసనమణిభూషణము లొకపడి సడల్చి. ౬౦

ఉ. కుచ్చెలు బిగ్గగట్టి కుచకుంభయుగంబుల బంటి నీటిలో
జొచ్చి యొకుమ్మడిం దరుముచుం దమలో దము నోలలాడుచు
న్విచ్చలవిడి నీదుచు నవీనవిహారవినోదలీలలం
బెచ్చుపెరింగి యొక్కొకతి జేర్కొనుచు న్విహరించి రత్తతిన్. ౬౧

చం. ఒక గజయాన వెంటఁబడి యొక్కమృగేంద్రసుమధ్య- నీటిలో
నికి బడద్రుంగఁదీయ గని నిత్యముఁ దానములందు భృంగకై
శిక లొకకొండ తెచ్చుటకొ జేరిరి మేలున జేరువార లో
పికఁగొని యాపద ల్గలుగువేళల చెంతలకైన వత్తురే !'' ౬౨

తే.గీ. ఉవిద యొక్కతె వెతికిలనుండి యీద
గోఁటిపోటుల చనులుఁ గన్గొనఁగనయ్యె
నంకుశక్షతరేఖల నలరు మరుని
మత్తమాతంగకుంభయుగ్మంబు పగిది. ౬౩

చం. సరఁగున షట్పదావళులఁ జంపకగంధి యొకర్తు జోపఁగా
నటిముటి యంచబోదలఘనాలక పెంపఱసేయఁగా బిసో
త్కరముల నొక్కమత్తగజగామిని ద్రుంపఁగ చక్రవాకులం
దరిమెను చంద్రబింబసమతాముఖి యొక్కతె చిత్రలీలలన్. ౬౪

మ. తమనీడ ల్సరసిం గనుంగొనినమాత్రన్ చిల్వరాకన్నెలన్
భ్రమచే కౌఁగిట చేర్పఁబోవుపగిదిన్ బాహాలత ల్జాపి- నీ
రమునం దీదుచు లోమునింగి తమి మీరన్నల్గడ ల్గాంచి-రి
త్తమతిం దేలుచు నిల్చి రబ్లితరకాంతల్ కొంద ఱగ్గింపఁగన్. ౬౫

ఉ. చేత మృణాళనాళ మొక చిమ్మనగ్రోవిగఁ బూని యొక్క సం
గాతపుచేడె మీఁదబడఁగా తనపుక్కిటినీరు జిల్కి త-

ధృతిని నీటిలో మునుగఁబోఁడిన దానికచం బటంచు నా
నాతిసతుల్ హసింప నొకనాచును బట్టుకలాగె వేగమున్. ౬౬

సీ. ముఖసరోజభ్రాంతి ముసరెడి తుమ్మెదల్
నాసికాచంపకోన్నతిని జూచి
భుజమృణాళభ్రమ బొరయు హంసావళుల్
జలదసదృగ్వేణిచయము జూచి
ఘననాభికాసరోగతరథాంగంబులు
విమలాననేందుబింబముల జూచి
భాసురాధరబింబధీసమాగతకీర
తతి సాంకవామోదతనులు జూచి

గీ మొఱలిడుచు వెల్లనై మిన్నుముట్ట నెగసి
కనులరక్తిమ గొనుచు చికాకు చెంద
సతులు జలకేళికాసముత్సాహ లగుచు
మెలఁగు తద్వైభవము వేరె దెలుఁపనేల. ౬౭

సీ. శశిముఖీ ! పద్మలోచనతో కలహమేల
వీక్షింపు మది రాహువేణి సుమ్ము
పగయేల కలకంఠి ! పల్లవాధరితోడ
నది విమర్శింప రామాంగ సుమ్ము
గజయాన ! పద్మాక్షికడ పంతగింపకు
మిథ్యగా దది హరిమధ్య సుమ్ము
వరటియాన ! మృణాళవల్లికాభుజతోడ
కనలకు మది తటిద్గాత్రి సుమ్మి

తే.గీ. యనుచు నునుజూడ్కులను మైత్రి బెనుచుకొనుచు
కలికిచిలుకల కొలుకులు గలసి మెలసి
సరసిసరసీవినోదము లరసి మురిసి
తలఁపునింపున జలకేళి సలిపి రపుడు, ౬౮

ఆ.వె. చాన యొకతె యప్పులోన మునింగియు
తేలలేక సుడిని దిరుగ జూచి
పడఁతి యొకతె కొప్పుఁ బట్టుక దిగిచె నేఁ
'దప్పులందు బడిన యటులగాదె'. ౬౯

చం. సరసిరుహంబుల న్మెలఁగు షట్పదకోటుల నొక్కబోఁటి స
త్వరగతి జోపి తద్వదనవారిరుహంబున వ్రాల, హస్తపం
కరుహముల న్విదిర్ప విడగాగ బెనంగెటి వాటి కొప్పునం
గరము రహించు సంపెఁగల గాటఁపుపుప్పొడి గుప్పె గుప్పునన్. ౭౦

సీ. కమలాక్షి నీ గజగమన గాసియొనర్చె
సింహమధ్యమ బుద్ధిజెప్పవమ్మ
చక్రవక్షోజ నీచంద్రానన గలంచె
నహిరోమరాజి నీ వడుగవమ్మ
సుకరబింబోష్ఠి నీశుకవాణి యడలించె
శుభగసాంకవమోద చూడవమ్మ
ననఁబోణి నీపికస్వని వంచన మొనర్చె
రామాంగి నీవైన రాగదమ్మ

తే.గీ. యనుచు సరసోక్తులను మేలమాడుకొనుచు
కలితకలకంఠకలరవ కలకలంబు
లాజలక్రీడగన వేడుకై జెలంగెఁ
గరము జెలువొందుఁ బంకజాకరమునందు. ౭౧

తే.గీ. చిరశిలీముఖసంతతిచే మునింగి
నట్టి పద్మిని ఘనశరఘట్టనముల
భంగమొంది కలంగి శుంభద్దళముల
విరిసె నిట నుండవలదని వెడలి రపుడు. ౭౨

తే.గీ. అటుల వెలువడి కాసారతటమునందు
నిలువ కచభారముల జారు నీరుజూడ

క్రొన్నెలు శ్లేషసంపద గొన్నకతన
శీల వర్షించెనేమొ ధారాగతిని. ౭౩

కం. అంతట శశిరేఖామణి
నెంతయుఁ గైదండ నొసఁగి యింతులు పసనా
ద్యంతరము జేర్చి యొకశశి
కాంతమణిస్థగితవేదికాస్థలమందున్. ౭౪

సీ. ఒకబోఁటి మేన్దడియొత్తె మెత్తనిచేల
తనువున విసమంటఁ దగ దటంచు
నొకసతి తడివల్వ లుంచక సడలించె
కపటముండుట మేలుగా దటంచు
నొకకాంత మేనపొందికగ పావడ దీర్చె
నప్పుదీరిన భాగ్య మొప్పు ననుచు
నొకలేమ కురులార్చి యొప్పఁగొ ప్పమరించె
ఘనరసం బౌదల నెనయ దనుచు

తే.గీ. నాకరాకర లిట్టు లఖిలవిధోపచార
ములను మణిభూషణంబుల నలవరించి
మంచికస్తురి కపురమ్ము మైనలంది
బొదలు నెత్తావి విరులు కొప్పునను దుఱిమి. ౭౫

కం. కొమ్మా సమ్మతి మున్నుగ
నిమ్మెయి జలకేళిసలిపి తికమీదట న
క్కమ్మవిలుతుఁ బూజింతము
రమ్మని దోడ్కొనుచు హర్షరస ముప్పతిలన్. ౭౬

మ. చలువల్ దేరెడి క్రొత్తగొజ్జఁగివిరుల్ జాల్కొన్న పన్నీటివా
రలచేతం గపురంపుఁబ్రామఁకుల తడిం గన్నట్టి లేఁగున్నపొ
న్నలపైఁ బెన్గొనుమాధవీలతలక్రిందం బుప్పొడిం దిన్నెపై
యెలమిం గ్రొంబడనైన గస్తురిరజం బింపొందఁ బైఁ జల్లియున్. ౭౭

గీ. కదళికాండములను నల్గడల నిలిపి
మల్లెపువుపందిరుల నుల్లసిల్ల నల్లి
కేతకీదళముల దళ్ల గీలుకొల్పి
తలిరుటాకుల తోరణమ్ములు ఘటించి. ౨౮

చం. గమకఁపు కప్పురమ్మున చొకాటఁపు ముగ్గులు దీర్చి సౌరభో
త్తమలవలీదళమ్ములను దర్పకునిన్ రతినిన్ లిఖించి, యా
హిమకరముఖ్యతద్బలము లీతల నాతల వ్రాసి వేదియం
దమరిచి ధూపదీపకుసుమాక్షతలాదిగ షోడశోపచా
రము లొనరించి కాంతలు నిరంతరభక్తి నుతించి రొక్కటన్. ౨౯

సీ. దండంబు కుసుమకోదండపాణికి నమ
స్కారం బదృశ్యతాకారునకును
వందనం బిదె శుకస్యందనునకును ప్ర
ణామంబు రతివధూకాముకునకు
శరణు త్రిలోకసంచరణసాహసునకుఁ
బ్రాంజలి విటవిటీభంజనునకుఁ
బ్రణుతి భృంగస్వనక్వణితానుమోదికి
నతి సమంచితపరభృతవితతికి

గీ. సకలకాముకజనమనస్సంప్రదీప్త
కిలికిలాసమిత్రాప్యయకేవలప్ర
తాపసుమచాపునకు వివిధోపచార
మనుచు నొక్కట వినుతించి యతిశయించి. ౩౦

సీ. కనులెత్తఁగొనక హుంకారించు భటకోటి
మేన గాయంబు గానీని తూఁపు
మొద్దున చిగురాకు మొలిపించు సేనాని
యిందందు నిలక మిన్నందు రథము
ఖండించినను వేళ్ళగలయ మొల్చెడి విల్లు
సంచరింపుచు ఝుంకరించు నారి

గంభీరఘుంకరసాకలితమై పెక్కెంటు
పండ్లుగిటుచు తోరబలుకు తేజి

తే. గీ. పుట్టి సిరిపుట్టివై పుట్టినట్టి జట్టిఁ
గంటిమే మున్నుతిగఁబంటి కంటిమంటి
నంటి పెనఁగిన యుడుపిల్పంటు వీవె
విరవిరహిజీవసంత్రాత చిత్తజాత. ౮౧

ఉ. ఇంక భవత్ప్రతాపము నుతింప దరంబె త్రిమూర్తుల న్నిరా
తంకముగాఁగ నొక్కొకరిఁ దా నొకని మేను సగం బొనర్చె ని
శ్శంకత బొమ్మ దట్టి వెలుచంబగు నేర్పున నోరుగట్టి య
భ్రంకషకీర్తిగన్న నిను బ్రార్థన జేసెద మో మనోభవా! ౮౨

ఉ. ఇన్ని వచింపనేల నిపు డీశశిరేఖను బార్థనందనుం
డున్నతిమీర నీవసుల నుద్ధతకేళిల మెలంగు సౌఖ్యసం
పన్నతఁగల్గనేని సులభంబుగ నీకును నీభటాళికిన్
మిన్నతిగా మహోత్సవ మమేయత జేసెదుమయ్య మన్మథా. ౮౩

కం. అని వినుతింపుచు వనజా
నన నాననవిల్తునకు మనం బలర ప్రియో
క్తిని వేడుకొను మదంపసు
చనువున బోధించి రుచితసమ్యక్ఫణితిన్. ౮౪

సీ. దర్శింపవమ్మ గంధవహామహాస్యంద
ముని కప్పుకొప్పువాసనలు నిగుడ
నుతియింపవమ్మ సంతతశుకారోహిని
కులుకుచక్కెర లొలుకు పలుకుఁజిలుక
సేవింపవమ్మ నెచ్చెలి నెలయల్లుని
కలవలనెనయు కన్గవలు నిలిపి
మ్రొక్కవమ్మ! శిలీముఖగుణధన్విని
విమలకోమలకరకమలములను

గీ. నింకమీఁదట గల భవదీప్సితంబు
సఫల మొందింపు నాళీకసాయకునకు
చిత్తకమలసమర్పణ జేయవమ్మ
రేవతీపుత్రి పుల్లశిరీషగాత్రి. ౧౫

కం. ఈచందంబున కామిను
లాచరితవ్రతసకలఫలావాప్తిగ వా
గ్వైచిత్ర్యగతిని బొగడి య
థోచితగతి మెలఁగుచున్ సముత్సాహమునన్. ౧౬

చం. తొలుత వనీవిహారమున దూలి తుదిం జలకేళి దేలి య
వ్వల వలరాజుపూజ లనివారితభక్తి నొనర్చి పైపయిం
బలువగు మోహదాహ మొకపాటిగ నెమ్మది మజ్జగించి యా
నలినముఖిన్ విహారభవనంబునకుం గొని దెచ్చు నంతటన్. ౧౭

గీ. మెలఁత విరహానలజ్వాల మిన్నుముట్టి
తనమయూఖానలోష్మంబు నెనసినపుడె
భానుమండల ముష్ణ ముష్ణేన శీత
ల మ్మనెడి రీతి ప్రొద్దు చల్లగను దోఁచె. ౧౮

గీ. తనదు జనకుని మందేహ దనుజవరులు
దినము బొడువఁగ యమునానదీజలములు
వెంటఁబడి వాని దఱిమెడి విధము దనర
ఛాయలెల్లను బశ్చిమాశకు గమించె. ౧౯

సీ. కుముదకుట్మలముల కొనలు మెత్తగిలంగఁ
దనమది మెత్తనై దడబడంగ
కమలంబు లఱమోడ్పుగని నెవ్వగల జెందఁ
దనగన్ను లరమోడ్పుఁ గనుచు డింద
శశికాంతములఁ గఱంగి సరగున జాల్వార
తనచిత్తము గఱంగి తాపమూర

హరిపశ్రుముఖికాంతు లజ వేడిమిని గుందఁగ
తనమేను నజ వేడిమిఁ గలంగ

గీ. విన్నదనమును గలిగి మైవన్నె దొలఁగి
జిగిబిగి సడల్చి తనవాసి చెడు నడల్చి
మగని తొలఁగిన మిగులనెవ్వగలఁ బొగిలి
చంచలింపుచు వెతనొక్కె చక్రవాకి. ౯౦

మ. పవలుం బక్షిణియైన పద్మిని వరింపం బూని దా లోకబాం
ధవుఁడై సద్ద్విజకోటులం దరిమి దిక్తాపంబు జూపించె నీ
రవి యంచుం జనులాడు నిందలకు నోర్వన్ లేమికిం బశ్చిమా
ర్ణవమధ్యంబున దూకినం గువలయారాతిత్వముం దీసెనే! ౯౧

సీ. సూర్యోపలచ్ఛవి సుముఖస్థి కవ చెంద
సుమధన్విజదత కోకముల బొందె
కోకసంఘముదీప్తి కువలయంబుల నొప్పె
కువలయశ్రమ కంజకోటి గప్పె
తమ్ములును చకోరతండమ్ము లన నొప్పె
నెసచకోరులకాక విటుల నొంచె
విటజనావళి మనఃకుటిల మింతులఁ జేరె
నింతుల సిగ్గు లంతంత జారె

గీ. నఖిలఖగకోటి నీరము లరసి జొచ్చె
మిన్ను లేఁసంజకెంజాయ మిగుల హెచ్చె
బలసి చీఁకట్లు చిగురించి బయలుబొంగె
జరఠభానుండు పశ్చిమజలధి క్రుంగ. ౯౨

శా. ఏ నుష్ణాంశుఁడ రాజు వెందవితె నేఁ డెట్లేఁగి మెట్లొచ్చునో
గాన న్నేనిఁట నుండనం చపరదిక్క్రాంతిం బ్రవేశించిన
ట్లానీరేజహితుండు న స్తగిరిశృంగాగ్రంబునం దొప్పె నె
ట్లైనం దీక్ష్ణు డనంగినం గువలయాహ్లాదంబు సంధిల్లదే. ౯౩

మ. సలిలాధీశ్వరుదిక్సతీమణి నిజస్థానంబునం భానుమం
డలముం జేర బ్రియంబునం జనులనిండం గుంకుమంబూని కెం
పుల మిన్నామినుకుల్ ధరించి యరుణంపుం బట్టుపట్టంబు మై
ని లలిం దాల్చి కనుంగొనం గతినిబూనె న్సాంధ్యరాగద్యుతుల్. ౯౪

సీ. ఇనుఁ డపరాంబుధికేగఁగా నెదురేఁగు
బడబాగ్నిశిఖి శిఖాపటల మొక్కొ?
కోకదంపతులపై కుసుమాస్త్రు డరిబోయు
నతులితాగ్నేయబాణార్చు లొక్కొ?
గగనాటవీసహకారభూజంబున
జనియించు పల్లవచ్ఛాయ లొక్కొ?
దినకరుం డరుఁగువెంటనె దిక్సతుల్ జేర్చు
ముఖముపై మేల్కమ్మి ముసుఁగు లొక్కొ?

గీ. పద్మకుముదాప్తు లిరువురపాలుఁ దెగిన
మహినహోరాత్రముల నడిమధ్యమమున
బాతుపొలిమెరకెంపుఁ గంబంబు లొక్కొ
యనఁగ లేఁసంజకెంజాయ లెనసె దిశల. ౯౫

ఉ. రాజగుఁగాక, సత్కళల రంజిలుగాక, బుధానుకూలుఁడై
భ్రాజిలుఁగాక, విష్ణుపదవర్తన నొందెడుగాక - మత్ప్రియుం
డాజలజాప్తుఁడే తపనుఁడైన ఘనుండను సాధ్విమాడ్కి నీ
రేజము లవ్విధుంగన భరింపకనే ముకుళించె నొక్కటన్. ౯౬

మ. గగనేభేంద్రము యామినీమదముసోకం బెల్లుగా గెర్లి య
స్తగిరీంద్రంబున బ్రొద్దు మావుతుసు ద్రోచం దత్తనూభిన్నమై
నొగులు న్నెత్తురు గ్రక్కెనో యనఁగ కన్ను ల్గోరగింపంగఁ బొ
ల్పుగ జూపట్టి దిశాచతుష్టయము దీప్తు ల్సాంధ్యరాగద్యుతిన్. ౯౭

సీ. అహరంబుధిని బ్రదోషాగస్త్యముని గ్రోలఁ
బాదున గనుబట్టు పంకిలంబొ

యామినీపతి యస్తాద్రి దవులఁ జన్న
గలిగిన దట్టంపు కాటుఁబొగయు
కదలిలో తనమణి బడిపోవ వెదకఁగా
జగము ద్రిమ్మరుచున్న గగనతలము
తారకారూపకందర్పశాసనలిపుల్
జూపట్టె నిదు మషిలేపనంబొ!

గీ. యలజరావారకామినీయౌవనాంగ
వేషసంధానకరణదివ్యౌషధంబొ
యనఁగ బెంపొంది గనుఁగొన నంతకంత
కంధకారంబు నిఖిలదిగ్బంధురంబు. ౯౮

చం. దినకరుఁ డస్తమింపఁగను దీనత పద్మిని కప్పె మోముపే
దన నతిశీతవాతరుజ దార్కొను కాలభిషగ్వరుండు పో
సిన బలుమందుమాత్రలు నజీర్ణములై యుదరంబునిండెనో
యన కమలాంతరాళములయందలి బంభరడింభము ల్దగెన్. ౯౯

కం. ఈవసుధ యువజనాళికి
భావభవాహవములీ విభావరి నగునన్
భావమున దుర్నిమిత్తపుఁ
గావురులం గప్పి యంధకారము బొలిచెన్. ౧౦౦

సీ. పెనుచీఁకటి మొగుళ్ల పెంపుచే గుంపులై
బడిన వర్షోపలప్రకరము లనఁ
గోకదంపతులఁ జీకాకుచేయ విధుండు
కరనాళముల నూరు ఖండము లన
గగనాపగాతరంగముల నొందొందుచా
కఁగ జిందు నమృతంపుకణగణమన
జగములొక్కటగెల్చి జనుపెంచు మగనిపై
రతిజల్లు పుష్పలాజతతులె యన

గీ. తరుణతరుణాతపమున నంబరవధూటి
తొగలు నెమ్మేని చెమ్మటబొట్టులె యన
తెలివి బొడసూపి చీఁకటి తెగలణాపి
చుక్కలొక్కట దిక్కుల పిక్కటిల్లె. ౧౦౧

చం. అపుడు రథాంగసంచయము లాత్రిని గూయ దొడంగె మింట రా
జీవు డిదె రాగలం డని దినేందిరయుం దనతేని సీగతిం
దపనుఁ డటంచు నోరువకఁ దజ్జలరాశిని ద్రోసిరంచు వి
ష్ణుపదమునంటుచున్ వెతను శోకిలుచున్నతెఱంగు దోఁపఁగన్. ౧౦౨

చం. మణుగులకిగ్గి సొక్కఁగొను మచ్చులు జల్లి భ్రమింపజేసి లో
నెఱవివరంబుసొచ్చి కడునేర్పున యిక్కువలంపుళయ్యలన్
మఱిఁగినవేళ గాంచి ధనవంతులసొమ్ములు దోఁచుకొందు ఱి
వ్వరుసను దస్కరు ల్మిగులవారవిలాసిను లొక్కటం దమిన్. ౧౦౩

కం. తనరాకమేలుకథ కుము
దినులకును జకోరములకు దెలుపఁగ మునుమున్
వనజారిబనుచు నెచ్చెలి
యనఁగా తూరుపున బాండిమాకృతి బొలిచెన్. ౧౦౪

సీ. పతిరాకకును నిశాసతిప్రేమ నెదురుఁగా
నడుఁగుల మడుఁగులు విడియెనేమొ
ప్రాక్సతి శశిని గర్భముదాల్ప దన్ముఖ
బింబంబుగను పాండిమంబు లేమొ!
రాజురా గని విహారమునకై సమకూర్చు
పగడంపు మణిమంటపంబులేమొ!
యంబుధీశుఁడు పుత్రాగమంబున బొంగు
తరఁగల బెరిగిన నురుఁగులేమొ

గీ. యనఁగ బ్రాగ్దిశభ్రమా సంతలోన
కాలముని విష్ణుపదము విభ్రాశియొసఁగు

ముఖ్యకుశకర్పూరహారతిఁ [illegible] వెలయు
శ్రీకరుం డౌచు వొలిచె సుధాకరుండు. ౧౦౧

సీ. అమరనాయకవధూహస్త[illegible]విలసిత
కనకమణిప్రభాకలశ మనఁగ
ప్రాగ్దిశాకామినీఫాలభా[illegible]
పొంకమౌ ఘుసృణపంకాంక మనఁగ
దర్పకదండయాత్రాసూచకంబైన
శకలాతుదేరా నిశాని యనఁగ
ఘననిశాకాంతాముఖప్రభాలోకనా
ర్థము బూను మించుటద్దం బనంగ.

గీ. చీఁకటు లణంగ సారసశ్రీ [illegible]
[illegible]
[illegible] తూరుపుకొండమీఁద
[illegible] ౧౦౨

గీ. తపను సాహస్రకిరణసంతప్తమైన
గగనలక్ష్మికి చంద్రికాగంధ మలఁది
ప్రాక్సతీమణిపీవ చేపట్టినట్టి
తాళవృంతంబుగతి సుధాధాముఁ డలరె. ౧౦౩

చం. కలువలు విప్పఁ బద్మినుల కాంతులు దప్ప రథాంగదంపతీ
కులములు మోము ద్రిప్ప సురకోటులు విందుల నొప్ప వారిరా
సులు పయికుప్ప వెన్నెలలసొక్కులు దిక్కులు గప్ప నింతఁగా
చలువవెలుంగుకుప్పరుచి సాంద్రత తూరుపుతిప్ప నొప్పఁగన్. ౧౦౪

గీ. సరసమై వసుగంధప్రసక్తి బూని
శతభిషక్క్రియ మౌచు సత్సంగతి దగి
వివిధరుఙ్మండలు హరించి కువలయప్ర
మోదము నొసంగె పూర్ణచంద్రోదయంబు. ౧౦౫

సీ. వితతచకోరికావితతి దాహము దీఱె
　　　　జతవీడి కోకదంపతులు వారె
చిమ్మచీఁకట్లు నొక్కుమ్మడి దిగజారె
　　　　విమలాబ్జముఖులలో చెమట లూరె
విరహులపై మరుం డరిదిక్తైమవు నూరె
　　　　వివిధతస్కరకోటి వెతల బారె
కులటాంగనలకు మిక్కుటపు ఖేదంబూరె
　　　　కుముదిని కోకవింత కొమరుమీరె

గీ. తమ్మిమొగడలంతేటి మొత్తమ్ము మారె
తరుణదంపతులకు మనస్తాప మారె
విటవిటీజను లలుక లొక్కటనె దీరె
పండువెన్నెల జగమెల్ల నిండి వారె. ౧౧౦

వ. ఇట్లఖండితప్రభావిడంబితం బగుచుండు పండువెన్నెలలు మండితపుండరీక బ్రహ్మాండకటాహంబున న్నిండి తండోపతండంబులుగా మెండుకొని శచీ సీమంతినీకాంతుచతుర్దంతదంతావళంబుతో సంతంత మంతనం బొనరిం పుచు సారకర్పూరపటీరడిండీరహీరతారశారదమందారశరమరాళజాలం బుల పగిది నదభ్రశుభ్రవిభ్రాజితంబై యుదయగిరిపరిసరచరద్వరముని నికరతరణికిరణధిక్కరణసటాపాటలత్వంబును మాటిమాటికి నీర్మటుచు, చటులకిటిపటలవికటాహవనటనఘటనపాటవోత్కటసమయాఽన్యోన్య - కఠోరదంష్ట్రోద్ఘట్టనంబున విట్టువడి యిట్టట్టుజారిన కట్టాణిముత్తియం బుల విట్టలంపుకట్టుల నిట్టట్టుం బొరలి చిటికొటారంబులం గ్రీడించు విటవిటీజనంబుల మదనకదనత్వరితంబునం జిక్కువడు హీరతారహారం బులం బేరజంబుఁ జేయుచు సమానమానసానుమోదంబున నహీనసూన విమానవితానంబులం దారోహించి యించువిల్కాని పంచశరసంచలిత హృదంచితులై సంచరించు వేల్పుమించుబోణులన్ రాణించు సుమనో హారంబులగు సుమనస్సుమనఃప్రకరంబుల నదలింపుచు క్రొన్నెల వెన్నెలలకన్న మున్నుమున్ను నుపనాథులం గన్నుసన్నల న్వెన్నుకొనం బన్ని ... పలితచతురతలం బతుల నితరేతరజను లెఱుంగని మఱుం

గ్రొత్త ముత్తెఁపుఁగుత్తుల కత్తిఁ గేల
హత్తి చిత్రజుఁ డదిగొ యంచెత్తి వెడలె. ౧౧౩

సీ. గంధసింధురదానగంధబంధురుఁడైన
గంధవహుండు మార్గంబు జూప
సంతతకాంతవనాంతలతాంతతని
శాంతవసంతుండు చెంత నడప
కోకిలాశారికాకేకిశుకాళిక
మేకీభవించి పరాకు దెల్ప
గంగాతరంగానుషంగస్వనోత్తుంగ
భృంగసంగీతప్రసంగ మెసఁగ

తే.గీ. యెండువడియుండు పాంథుల గుండెలెల్ల
భేదిలంగను ఢాంఢమీనాద మొదవఁ
బిబిలకందర్పబహదురీపాదుషాహి
వెడలె రణరంగధీరాంకవీరుఁ డగుచు. ౧౧౪

లయవిభాతి:—

పొంగుచును సింగముతెఱంగునను దూకి బహు
భంగుల మెలంగఁ బొదలం గలసి వేగన్
ముంగలికి వంగి కనకింజిని ఘణింగున బొ
సంగగను మీటుచు జెలంగి యతివేడ్కన్
హంగుగను మేటిగొజ్జంగిపువుతూఁపులు ని
షంగము వెదల్చుచు తరంగములలీలన్
రింగున సదల్చియును నుత్తుంగగతి నార్చుచు స
నంగుఁడు నభంగురజయంగతి సెసంగెన్. ౧౧౫

ఉ. వెన్నెలతాకకే మిగుల వేసటజెంది వియోగవేదనా
పన్నత దల్లడిల్లు బంభ్రదతనూజకుచాగ్రదుర్గముల్

ఖిన్నము జెందునట్లు వెఱపించుచు పెంజడివానరీతిగా
గ్రొన్ననవింటిజోదు 'శలగో శలగో'యని గ్రుమ్మె నిమ్మడిన్. ౧౧౬

కం. పొంచి వెనువెంటనే మే
న్వంచి విరింగోల వింటనుంచి గుణిం బా
టించి సవరించి పై లం
ఘించి సరాయించి తమి మొగించుక మించెన్. ౧౧౭

కం. ఆకోల యేటుపాటున
కోకిల లొక్కుమ్మడిగను 'కో'యని కూయన్
పైకి ధువాళింపఁగ నా
కోకిలమృదువాణి యొద్దు గుడుచుచు బలికెన్. ౧౧౮

ఉ. అమ్మకచెల్ల! యీబలుగయాళిమరుం డతిదుండగీడు పై
గ్రుమ్మెడు సంపచిచ్చులకు కమ్మనితెమ్మెర బమ్మరింపు నా
కుమ్మడి జిమ్మిరేగి నెఱిహుమ్మని ఝుమ్మన నమ్మ గ్రుమ్మె దే
హమ్ము నిజమ్ముగా నిలువదమ్మ యికేమని తెల్పనావెతల్॥ ౧౧౯

సీ. తనసహోదరుఁ డంచు దలఁపక గ్రూరుఁడై
కూఁతుతో నెనయఁగా గూర్చె నితఁడు
తనకగ్రజనకుఁ డంచనక తాపససాధ్వి
పై మరుల్గొల్పిన పాపి యితఁడు
తనపుత్రకుఁ డటంచు తర్కింపక తపంబు
జెరిచి యోషాసక్తి జేర్చె నితఁడు
తన మేనమామ యౌ ననక దుర్వృత్తిచే
గురుతల్పగమనార్తిఁ గొల్పె నితఁడు
ప్రజలు అదిగాక తనదేహబాంధవులగు
వారికే రోయడీ శంబరారి యహహా!
యూరకే నన్ను బాధింపకుండగలడె
యింక నైవేచ్ఛ యెటులున్నదేమొ కాని. ౧౨౦

కం. అని తలఁలో తను [illegible]
తను తనుతాపమున మిగులఁతహతహఁగాను జ
వ్వని వనితలెల్ల గవిసి వ
చనరచనాసౌహార్ద్రప్రసక్తి నెఱపుచున్. ౧౨౧

ఉ. కొమ్మ నరాత్మజుం దలఁచుకొంటివొ? మేన్పులకల్ జనించె సు
మ్మిమ్మెయి మున్నువోలె మనసిచ్చి ప్రియమ్మున బల్కరించవే
యమ్మ, తపస్మితంబు విరహభ్రమ జూపె గదమ్మ, దాచనే
మమ్మ! వచింపుమమ్మ! వికచాంబుజపత్రవిశాలలోచనా! ౧౨౨

చం. చనువుగ నంచలం గనుల సైగలనైనను జేరఁ బిల్వవే
మనిశము కీరశారికలకైనను బద్యము జెప్పవేమి? పెం
చిన ఫణిభుక్కిశోరములు జేరిన చెక్కిలి గొట్టవేమి? యో
వనజదళాక్షి యిట్టు పలవంతల చింతిల నేమి హేతువో? ౧౨౩

వ. అని యనేకప్రకారంబులం బలుకు నెచ్చెలులపలుకు లచ్చెలువ ప్రీడాభరం
బునం బరాకు చేసికొని చిఱుచెమట గ్రమ్మిన నెమ్మొగమ్ము మరంద
బిందుసందోహకంచళితారవిందంబు చందంబునం దనర- నిట్టూర్పులు
నిగిడించుచుఁ గళవళించుచున్న సమయంబున- ౧౨౪

సీ. అంతకంతకు నుదయాద్రిపహ్ని జనించు
వేడివెన్నెలఁజూపి విధుఁడు జెలఁగ
నుగ్రాతు కనుచిచ్చునోర్చి నిగ్గునదేలు
యలరువేడిమితూఁపు లతనుఁ డేయ
బెనుబాముకోఱల బెనఁగి కంపము సూపు
కడువిసవిత్తులే గాడ్పుసోక
పోటుజెందిన గట్టుబోటియలలో దూఱు
ఘనభీతి వెలిపుల్గుగములు వొదవ

గీ. నింతి యంతింతయనరాని వంతబూని
వలఁపువెన్నానితోడి నెచ్చెలులతోడ

భాషణముమాని యరవిరిపొప్పుపైని
నిమ్మెయిని చెమ్మటలు గ్రమ్మ సొమ్మసిల్లె. ౧౨౪

కం. అది గని బెదరినమది ప్రియ
సుదతీమణులెల్ల చుట్టుచుట్టుకొని నయం
బొదవ మదిరాక్షికౌఁగిట
బొదవుచు వెంజలిచి మేనుబుణుకుచుఁ బ్రీతిన్. ౧౨౫

ఉ. పిన్నతనాన మున్ను మురిపింపఁగ జూపిన మత్ప్రియుం దయా
సన్నత నేఁడు జూపుమని సన్నిహితంబున దీనవృత్తిచే
సున్నవిధంబుదోప మెయినుండిన తావులుమాని ప్రాణము
ల్కన్నియ కన్ను లన్నిలిచె గన్గొనరే యని భీతచిత్తలై. ౧౨౬

పడఁతి మనోవార్ధిఁ బడి మునింగెనొ యేమొ
తతబాష్పజలబుద్బుదంబు లవిగొ,
హెంఁతి యాశాలతల్ పుష్పించెనో యేమొ
తనుఘర్మజలమరందమ్ము లవిగొ
యువిదవాంఛాధుని యుప్పొంగెనో యేమొ
మేన పొండిమఫేన మూనె నదిగొ
లలనకు విరహానలము జనించెనొ యేమొ
నిట్టూర్పుబొగలు జూపట్టె నవిగొ

గీ. యక్కటా! యివి సామాన్యమని దలంప
వలయు నికనైన గాపాడవలయు పడఁతి
నట్టుగాకున్న కన్నె నిట్టట్టు జేయ
ధూర్తగతిఁజొచ్చు మన కపకీర్తివచ్చు. ౧౨౭

సీ. మధుపకోటికి బ్రణామము జేసి దెచ్చుమ
రందమ్ము మధురాధరమున జిల్కి
గంధవాహికి నమస్కారణఁజేసి గ్రహించు
పూవుగుత్తులు కుచంబుల నమర్చి
ఒసభుక్తతికి దండమొసఁగి తెచ్చిన మృణా
ళంబులు బాహువల్లరులఁగూర్చి

కిసలయ[?]గ్రసనాశికిని [?]మొక్కి[?]దిలభించు
తలిరుటాకులు పదమ్ముల ఘటించి

గీ. తరుణి యివి పంచశరదేవతాబలంబుఁ
దత్ప్రసాదంబు లీపదార్థములవలన
వెఱఁపుదీరు నటంచు గావించి రపుడు
చతురరచనల శిశిరోపచారవిధులు. ౧౨౯

సీ. అలరులు గుములు నంచని చింతపడకు వే
కలకంఠిపదములు గప్పవమ్మ
యుడుకునంచని వెతనొందకు మలివేణి
సుమములు కొప్పున జుట్టవమ్మ
వాడునంచని భీతివలవ దండజయాన
బాహులందు బిసాళి బన్నవమ్మ
కన్నులఁ జేర్పవే కమలముల్ చెడునంచు
కోక స్తనీ వంత గుందకమ్మ

గీ. వీటి నాహారమని చూడ పాటిగాదు
చెలిమికొఱ కెంతపనియైన జేయవచ్చు
గాని యిది కొంచెమౌ పనిగాని దెఱిఁగి
జేరి శైత్యోపచారముల్ జేయవలయు. ౧౩౦

సీ. చందనం బలఁదవే శైలవక్షోజ క
ర్పూరం బొసంగు రంభోరుయుగళ
హిమజలం బిడవె తుహినమయూఖనిభాస్య
చిగురుటాకులు గూర్పు మిగురుఁబోణి
ముత్తియమ్ములహారములు వైచు ఘనవేణి
కాశ్మీరమును బూయగదె శుభాంగి
మకరందబిందువు ల్మయిజిల్కు పూఁబోణి
పుప్పొడుల్ జల్లు మంభోజగంధి

గీ. యనుచుఁ దమతమ కనుకూలమైనపగిది
నొకరినొక రుచ్చరింపుచు నోపినటుల
గూర్చి శశిరేఖ తనుతాప మార్పుకొఱకు
సకలశిశిరోపచారము లాలిపి రపుడు. ౧౩౧

చం. సరసిజనేత్ర లింతి యుపశాంతికినై శిశిరోపచార మీ
కరణి యొనర్పఁగా సురభిగంధము పెద్ది పరాగమై ధరం
దొరిగె నిగుడ్ల క్రొవ్విరులు తుత్తుములయ్యె బిసంబులెల్ల ఖం
గురగతి వాడె మైనినిరె గొజ్జఁగినీరు మనోజవేదనన్. ౧౩౨

కం. తోడిచెలు లెట్టొనర్చిన
నాడాదకు ప్రుక్కువార లందరిలో బల్
నాడెమగు చేడి యొక్కతె
నాడి పరీక్షించి గుంఫనంబున బలికెన్. ౧౩౩

సీ. అంతకంతకు తాప మధికమై చెలిమోహ
ముడుగదే 'పూర్ణచంద్రోదయము'న
మఱిమఱి ప్రబలమై మది గలంచునుగదే
యింతికి 'మదన కామేశ్వరము'న
మాటిమాటికిని యారాట మొందునుగదే
రమణీమణికి 'వాతరాక్షసము'న
గడెగడెకింక వెక్కసము జెందునుగదే
సతి'నీలకంఠరసంబు'వలన

గీ. దినదినం బెక్కువగుఁగాని తీరదే'వ
సంతకుసుమాకరంబు'న సకియలార
'భూపచింతామణి'ని గాని పొలఁతి విరహ
దారుణజ్వరదోషంబు దీరదమ్మ. ౧౩౪

సీ. మరువక నిక నుగ్రమంత్రము ల్పఠియించి
తనుహీనభూతమ్ము దరుమరమ్మ

సత్తమోపాసనల్ సలిపి గురుద్వేషి
యగు నిశాచరపీడ నణఁపరమ్మ
వెస సహోమక్రియావిధు లొనర్చియు పెను
గాలిపోకుడుం బో గదపరమ్మ
ఘనుల ప్రార్థించి పంకప్రచారవిజాతి
గణముల కావరం బణఁపరమ్మ

తే.గీ. యటులగాకున్న మదనశశాంకగంధ
వహమరాళాదులకు తాళవచ్చు నటరె
యనుచు రంభాదశోచితవ్యజనములను
బూని విసరుచు నుపచారములు ఘటింప. ౧౩౭

గీ. అప్పు డొక్కింత తడవున కవ్వధూటి
యులికిపడి లేచి పవళించి కళవళించి
కలవరించి బయల్గాంచి కౌఁగిలించి
యింతులనుగాంచి దుఃఖించి యిట్టులనియె. ౧౩౮

సీ. అలవిరు లనిజెప్పి యగ్నికణంబు లీ
వడగాడ్పులకు తోడు నిడఁగదగునె
పన్నీరటని కాచియున్న నూనియ మేని
వలకాకలకు దోడు జిలుకదగునె
గోవకప్పురమంచు క్రొత్త సున్నంబు వె
న్నెలవేడికిని తోడు నిడఁగదగునె
చిగురాకులని యంపతెగలను మరుకైదు
వులకుఁ దోడుగ నెద నిలుపఁదగునె

గీ. యకట చెలులార తొంటినెయ్యం బొకింత
దలఁప కిరీతి పగదీర్పఁ దలఁచినారొ!
గాక యుండిన వీటికి కాకలేల
యనుచు విలపించు మదినోడి యలరుఁబోడి. ౧౩౯

వ. అంత నయ్యింతి లతాంతకుంతనియంత్రితస్వాంతయై యంతింతనరాని చింతాభరాక్రాంతంబున సంతకంతకుం గొంతరిలుచు నెంతన్నెలంగు మంతనంపుఁబలుకులం గనుంగొని యిట్లనియె. ౧౩౮

సీ. తలఁదిమ్ములౌనఁగు గద్దియిమ్మెదలఁ గొల్చి
చేయరే కనకాభిషేకమైన
కెర్లివర్ణెదు రాజకీరంబులకు మ్రొక్కి
గనపరే సొంకవగంధపూజ
కలగించు జక్కవగమిని సన్నుతిఁజేసి
యర్చించరే నిర్మలాబ్జములను
వెలపించు కాదంబవితతిని బ్రార్థించి
సలుపరే ఘనమహోత్సవవిభవము

గీ. గాఁ యుండిన మదపంచరీకశాక
శోకకలమానసౌకంబు లేకయై చి
కాకు బైకొనె మరు సంపకాక కోప
తరము గాదమ్మ దీని బోఁదరుమరమ్మ. ౧౩౯

వ. అని పలికిన కలికి కలికిపలుకుల కులికి యక్కలకంఠకంఠ లొక్క-మొగి శశిశుకశారికాచంచరీకకేకిమలయపవనమరాళసమేతుండగు మనోభూతు నుద్దేశించి యిట్లనిరి. ౧౪౦

సీ. గుబ్బలపై బయల్గొన్న చెమ్మట బొట్ల
పరిమళసలిలార్ఘ్యపాద్య మొసఁగి
విరహానలోగ్రసంజ్వరతా సముత్పన్న
పాండిమ శ్రీగంధపంక మలఁది
తాపాతిరేకనిద్రాహీనశోణదృ
గ్జలజాతపుష్పాంజలుల నొసంగి
మహితనిశ్వాసధూమశ్రేణికాఘ్రాణ
తర్పణధూపసమర్పణ లిడి

తే.గీ. పూజ గావించుచున్న దీపువ్వుతోడి
చిత్తమున నీవుగల్గుటజేసి గాదె
మ్రొక్కఁదలఁచిన చేతులు చెక్కఁదలఁచు
సామి తాయెను నీపూజ యోమనోజ. ౧౪౧

సీ. శిరముపై గేదఁగివిరితురాయియె గాని
తిలకింప చంద్రమండలముగాదు
అళికమున నింపుకస్తురిపట్టియే గాని
కాలకూటప్రభాగరిమ గాదు
కాయంబునను గంధకర్దమంబేగాని
పాటింప భూతిలేపనముగాదు
చెలియపేఁపునజారు సిగముడియేగాని
భయదభాస్వజ్జటాభరముగాదు

తే.గీ. కాని నీపాంథమారకక్రమము గనిన
విలయకాలోగ్రమూర్తిగా దలఁపబడియె
నకట నీకిది తగదోరి శుకవిహారి
సకలనారీమనోహారి శంబరారి. ౧౪౨

గీ. మదనభవదంబసదనసంపద నణంచు
శశిని యర్మిలి యొనరింప జనునె శాస్త్ర
రీతులను 'సర్వనాశాయ మాతుల' యని
దెలియఁగా లేదొ ! యికనైన దెలియరాదొ ! ౧౪౩

చం. హరితనయాఖ్యచే హరునహంకృతి బైకొని కాలరూపునం
గరము రహించియు న్విషమకాండనిరూఢి నఖండధర్మవి
స్తరత వహించి లోకభయదాతను వృత్తిజనవ్యథోచితా
చరణత జెందు కాలయమసామ్యముఁ దవైతివి నీవు మన్మథా. ౧౪౪

సీ. జనకుఁ డంతకు పుణ్యజనపీడన మొనర్చు
తల్లిచాంచల్యవర్తన మెలంగు

సీ. పిట్టపెక్కె నింత మెట్టివతిమెదవేమి
యది గుజ్జమైతె మిన్నదెదేమొ!
చెఱకువిల్లాని యిన్నిచేష్టలు చేసేవు
యది పాపమైతె మాటాడవేమొ,
చిగురుకోలతె యింతయెగసిపో దలిచేవు
యది వజ్రమైతె త్రుళ్లాడెదేమొ
తనువులేకనె యింతదర్పంబు జూపేవు
యదియున్న శివమెత్తి యాడెదేమొ

గీ. గాయయుండిన దుర్మదోద్రేకవృత్తిఁ
దాకి పైకొనుటిది లజ్జలేక గదర
విరహిణీమార! శంబరాసురవిదార
మథితసుకుమార!మార!కల్మషవిచార. ౨౦౭

సీ. తుంటలై నీ విల్లు ధూళిలోన నణంగఁ
జొలుపొందు నీ మేను బూదిగాను
నీయంపగమివిచ్చి నేలపాలై చన
మఱయు నీ రథి మొక్క మూలఁ గూల
చెదుగు నీసారథి యడవిలోపలఁ జేర
నీవైన నీటెక్కె మేట గలప
నిను మ్రోసెడి తురంగమును సంకెన ల్వేయ
నీమేటి చెలికాని పాము కరవ

గీ. చెట్టుకొకటూచు నీసేనలంట్టె గిట్ట
నయ్యయో నీవు 'పాపీ చిరాయు'వనెడి
నీతి నీకితి విరహిణీఘాత వైతి
వింక మకరాంక చెలి నేచు టేమి శంక. ౨౦౮

తే. గీ. అనుచు వనజాననలు మరునిని కినుకను
తనవి సనకను జెనఁకి యాతనివెనుకను

జేసి యానారిఁగావించు సిరజాకి
సారెసారెకు జలపోరి మూరఁగోకి. ౧౩౦

సీ. బుధనుతుండగు క్షీరనిధి కుమారుండవు
ఘనుఁడైన కోకబంధునకు హితుఁడవు
వాదానవారి నెయ్యంబైన మఱఁదివి
శంకరస్వామి చూడాంకమణివి
దక్షునియోజకు దగిన యల్లుండవు
విబుధక్షుధలుదీర్చు వెన్నకడివి
యసమాస్త్రునకు ఘనంబగు మేనమామవు
శ్రీదేవికిని ప్రియసోదరుఁడవు

తే.గీ. నట్టిసత్కులజాతుండవై దనర్చి
పరవిమోహలపై వేడి జఱఁపదగునె
పుష్పచాపాస్త్ర విరహిజీవాంతకైత్ర
గురుసుధామయమృదుగాత్ర కుముదమిత్ర. ౧౩౧

చం. మనమున నీతిలేక గురుమానిని బొందినద్రోహి వంచు నీ
చెనఁటితనం బెఱింగి సిగజేర్చెను శంభుఁడు లింగధారిపం
చనెడి హితంబుగాంచి గద హా! ధరనెట్టి దురాత్మునైన త
న్ననిశము గొల్చినంతనె మహాధికుజేయుఁ బురారి యల్పుఁడై. ౧౩౨

సీ. కువలయావనకీర్తిగానినందుకు ధరిత్రి
చక్రవిద్వేషంబు సడలలేదు
విబుధానుకూలప్రవీణుండవై యుండి
మది గురుద్వేషంబు మానలేదు
ఘనవిష్ణుపదసక్తకచుఁడవైనందుకు
నీ నిశాచరవృత్తి మానలేదు
ద్విజరాజవిఖ్యాతిదీపించుటకును స
త్సంతతి పెంపొర్చు చింతలేమ

తే.గీ. విసుధ వర్తింప మసమార్గవర్తి వగుచు
రాజకాంతావిటులను గలంచబూను
నెఱయు విరాజశబ్దంబు నేతిబీర
కాయ గదరోరి! శశధారి! కమలవైరి! ౧౪౩

సీ. తోయధిఁ బడబాగ్నితో మొద ల్జన్మించి
హాలాహలాన్యోన్యస్య మగుచు బెరిగి
నిలిచి యుగ్రాక్షుని నెత్తిమీఁద నటించి
యుదయాద్రిదవశిఖి నొరసి మెఱసి
యలరాహుదంష్ట్రా విషాగ్నితోడ బెనంగి
తపనుని నెండల తారసిల్లి
భావింప నత్రితపోవహ్నిచే గ్రాఁగి
గురుశాపశిఖి శిఖాకులతఁ బొరలి

గీ. నట్టి చలపాదివైన నిన్నజ్ఞు లెల్ల
శీతకరుఁడని మిథ్యాప్రతీతి దనరి
బాలికామణులను నేచనేల రోరి
కామినీమానధనహారి! కమలవైరి! ౧౪౪

సీ. భగినిపుట్టించి సంపదలెల్ల బోకార్చి
పసఁబూని జనకు భంగగతు జేసి
బలిమిమేనల్లుని భస్మంబు గావించి
తలపఁ మఱందిచిత్తము గలంచి
తమ్ములపై విరోధమ్మున బెంపొంది
సత్సంతతులపెంపు సడలఁజేసి
సరిలేనిగురుని సంసారహాని యొనర్చి
దేవుఁడౌ హరుని నెత్తిననె జేరి

గీ. చెలిమిఁ గుజనుల నభివృద్ధి జెందఁ జేసి
చావుగానని బలు నిశాచరుఁడ వీవు

